# స్నేహ సుమాలు

## రష్యా జ్ఞాపికలు



రచన :

**డా॥ వాసా ప్రభావతి**

ఎమ్. ఎ. పి. హెచ్. డి.

లెక్చరర్

వనితా మహావిద్యాలయ

హైదరాబాదు.



వాసా ప్రచురణలు

మలక్‌పేట మునిసిపల్ కాలనీ

హైదరాబాదు-500036

# స్నేహ సుమాలు

డా॥ వాసాప్రభావతి

SNEHASUMAALU
by
Dr. VASA PRABHAVATI

ప్రథమ ముద్రణ 1988
వెల. రూ. 6/-



ముఖ చిత్రం :
శీలా వీర్రాజు

ప్రతులకు :
వి. వి. యస్. ప్రకాష్
వాసానిలయం,
11/2 ఆర్. టి. మునిసిపల్ కాలనీ
మలక్ పేట, హైదరాబాదు-500 036.

ముద్రణ :
స్నేహలతా ప్రింటర్స్,
హైదరాబాదు-48.

# కానుక

అనర్గళ వాక్ చమత్కృత వైభవంతో సభాసదుల హృదయాలను
ఉక్కిరి బిక్కిరి చేస్తూ యువతరానికి ఉత్తేజం
కలిగిస్తూ నేటి తరానికి ప్రతినిధిగా
మూర్తీభవించిన సౌజన్యంతో సభాసామ్రాట్
బిరుదును సార్థకము చేసికొనుచు జంటనగరాల
సాహితీరంగానికి చేయూతగా నిలిచిన
శ్రీ కె. వి. భాస్కరరావుగారికి
నా యీ కవితను కానుకగా అందిస్తున్నాను.

డా॥ వాసా ప్రభావతి

# కృతజ్ఞతలు

నా యీ గ్రంథాన్ని కానుకగా స్వీకరించడానికి అంగీకరించిన శ్రీ కె.వి. భాస్కరరావు గారికి, ఇస్కాన్ తరపున రష్యా పర్యటనకు అవకాశం కల్పించిన శ్రీ వేములపల్లి శ్రీకృష్ణ గారికి, కిన్నెర బృందంతో రష్యా పర్యటనకు నాకు అవకాశం కల్పించిన శ్రీమద్దాళి రఘురాం గారికి, రష్యా పర్యటనలో నన్ను సోదరిగా భావించి నన్ను అభిమానించి, గౌరవించిన డా॥ సుంకు బలరాం గారికి, వారి సతీమణి అన్నపూర్ణ గారికి, శ్రీ కె. వి. భాస్కర రావు గారికి జి. భాస్కర రావు గారికి, సాయికుమార్ గారికి, సత్యన్నారాయణ గారికి, శ్రీ గుప్తా గారికి (మదనపల్లి) నా ప్రత్యేకమైన కృతజ్ఞతలు అంద జేస్తున్నాను. అందమైన కవరు పేజీ వేసి ఇచ్చిన శ్రీ శీలా వీర్రాజు గారికి, సకాలంలో పుస్తకాన్ని అచ్చువేసి ఇచ్చిన స్నేహలతా ప్రింటర్స్ శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు గారికి నా కృతజ్ఞతలు అంద జేస్తున్నాను. ఈ పుస్తకాన్ని చదివి ఆదరించే సహృదయు లందరికి కృతజ్ఞతలు.

డా॥ వాసా ప్రభావతి.

# కవితాంజలి

ఏ సామ్యరాజ్యం
అగ్నిపుష్పంలా ఉద్భవిల్లి
ప్రచండ సూర్యునిలా ప్రజ్వరిల్లి
ప్రజా స్వాతంత్ర్య పీడితులకు
భద్రకాళిలా నిలిచిందో

ఏ సామ్యవాద పాలన
మహార్ణవంలా ఉప్పొంగి
అగ్ని శిఖలా మెరుస్తూ
పరపాలనా వాంఛితులను రూపుమాపి
విప్లవ జ్యోతులు వెలిగించిందో

## 2

ఏ సామ్రాజ్య పాలన
కాలరుద్రునిలా తాండవిస్తూ
ప్రళయ కాల ప్రభంజనంలా హుంకరిస్తూ
పెట్టుబడి దారుల దౌర్జన్యాలకు
విప్లవ శంఖం పూరిస్తోందో

ఏ సామ్యవాదం
కాలాంతకుని గదా దండంలా దూసుకువచ్చి
వష్ట కాభ్రయమై ముందుకు వచ్చి
దౌర్జన్య వాదుల గుండెలలో
ప్రళయగర్జన చేస్తోందో

అట్టి స్వేచ్ఛా పరిరక్షణ జ్యోతికి
అట్టి స్వాతంత్ర్య మార్తాండమూర్తికి
అట్టి మేరు సంకల్ప నిశ్చల నిధికి
అట్టి సోవియట్ దేశానికి
అందిస్తున్నాను
నా కవితాంజలి.

-:o:-

# వర్ధిల్లు! వర్ధిల్లు! రష్యా

వర్ధిల్లు వర్ధిల్లు
సోవియట్ రష్యా :
వర్ధిల్లు వర్ధిల్లు
సోషలిస్టు రష్యా :

మార్క్స్ ఆశయాల పునాదులపై
లెనిన్ ఆచరణల నిర్మాణాలపై
అవతరించిన రష్యా :
స్వాతంత్ర్య సమానతల
చక్ర రథముపై
పురోగమించే రష్యా
వర్ధిల్లు : వర్ధిల్లు.

4

కష్టాల కారు చీకటిలో
దిక్కు తెలియని
బానిస బతుకుల్లో
సుఖాల దీపాలు
వెలిగించిన రష్యా
యంత్రాల రాపిడిలో
నలిగిపోతున్న
కార్మిక జీవనంలో
ఉత్సాహపు ఊపిరులు
పోసిన రష్యా
కార్మికోద్యమానికి
ఆజ్యం పోసి వెలిగించిన రష్యా
కార్మిక జనావళికి
అమరధామం నిర్మించిన రష్యా

పెట్టుబడి దారుల
విధ్వంసకాండలను
ధ్వంసముచేసి
సామాన్యులకు
పట్టము కట్టించిన రష్యా
వర్ధిల్లు : వర్ధిల్లు.

అణు శస్త్రాలను
ఆకాశం ఎత్తున నిర్మించినా
ప్రపంచ శ్రేయస్సుకై
పాటు పడే రష్యా.

అంతరిక్షమునకు
ఉపగ్రహాలను పంపి
గ్రహాల చరిత్రకై
కృషి చేసే రష్యా
వర్ధిల్లు ! వర్ధిల్లు !
అతి విశాల దేశమై
విశాల హృదయంతో
ప్రపంచ కళ్యాణానికై
పాటు పడే రష్యా !
స్వాతంత్ర్యము పొందిన
అచిరకాలంలోనే
ప్రగతిని సాధించి
భూతల స్వర్గం నిర్మించి
ప్రపంచాన్నె చకితను
చేసిన రష్యా !
వర్ధిల్లు వర్ధిల్లు.
గోర్బచొవ్ కార్యదర్శిగా
అభ్యుదయ మార్గాలలో
పయనించే రష్యా
అటం బాంబుల వంటి
ఆటంకాలను అధిగమించి
ప్రజా క్షేమమును
పరి రక్షించే రష్యా !
భారత దేశంతో
స్నేహ బంధాలను
పెనవేసుకుని
ఔన్నత్యాన్ని అందుకునే రష్యా

6

నీ హృదయం అతి విశాలం,
నీ భావం మహోన్నతం
నీ ఆచరణ మహోజ్జ్వలం
నీవు పంచేది సహకారం
నీవు పెంచేది సౌభ్రాతృత్వం
నీవు కోరేది విశ్వశాంతి
అందుకే మనసారా
కోరుకుంటున్నాను
పగటి సూర్యునిలా
నీ ప్రతాపం
కలకాలం వెలిగి పోవాలని
ప్రపంచ చరిత్రలో
ప్రథమ స్థానం
నిలుపు కోవాలని
వర్ధిల్లు రష్యా !
వర్ధిలు! వర్ధిల్లు!

: o-o :

# స్నేహ సుమాలు

స్వేచ్ఛా భారతానికి
వారసురాలిని
సోవియట్ రష్యాకు
స్నేహితురాలిని
నా దేశంలో పరిమళించే
సంస్కృతీ సుగంధాలను
నా మాటలలో మూటలుకట్టి
మీ దేశం నిండా జల్లాలని
మీ దేశంలో వెలిగే
అభ్యుదయ జ్యోతులను
నాకళ్ళనిండా నింపుకుని

8

మీ దేశంలో వీచే
మైత్రీ సుగంధ రాసులను
మనసునిండా నింపుకుని
నా వెంట తీసుకు వెళ్ళాలని
ఉరకలేస్తోంది నా మనసు
శాంతిదూత మహాత్మాగాంధీ
ఆశయాల పంటగా ఉద్భవిల్లి
నేతాజీ సుభాసు బోసు
రంగరించిన పౌరుషంతో
వీరవనితై నిలిచి
జాతి నేత జవహర్
తీర్చి దిద్దిన శిల్ప సుందరై
వెలిగే భారతంలో
జన్మించాను నేను
ఉవ్వెత్తున ఎగిరే
త్రివర్ణ పతాకపు రెపరెపలలో
గుండె నిండా దేశభక్తి నింపుకుని
సాగే అరువది కోట్ల జనుల
అడుగుల సవ్వడులలో
ఉజ్జ్వలించే దేశంలో
పెరుగుతున్నాను నేను
ఇరువదిరెండు రాష్ట్రాల
నాగరికతను కాశ్మీరు శాలువాలా
నిండుగా కప్పుకొని
మూఢాచారాల ముళ్ళువిప్పి

మత మౌఢ్యాల కళ్ళు తెరచి
సామ్యవాదం విత్తుకుంటూ
సాగే విశాల భారతంలో
మనసు సువిశాలం
చేసుకుంటూ ఎదుగుతున్నాను నేను
అక్షుణ్ణ ఆశయాలతో
ప్రగతి రెక్కలు చాచుకుంటూ
విజయ పతాకాలు విసురుకుంటూ
పురోగమించే దేశంలో
తెంచుకుంటున్నాను అవరోధాలు
పెంచుకుంటున్నాను ఆత్మబలం
భారత సోవియట్ దేశాలు రెంటా
సమైక్యతా భావంతో
సాంస్కృతిక సాహితీ బంధాలు పెనవేసుకుని
విశ్వశాంతికి
మంగళ గీతం ఆలపించాలని
స్నేహ సుమాలతో
ప్రపంచ ధామం
అలంకరించాలని
మనసారా కోరుకుంటున్నాను

# నాయకమణి లెనిన్

ప్రపంచ దేశాల నాయకత్వానికే
కొత్త నగిషీలు చెక్కిన ఘనశిల్పి
రష్యా ధీశాలి లెనిన్,
మాతృదేశాల తిరుగుబాటును
పెనుగాలిలా పూరించి
మూఢాచారాల కప్పగంతులను
దేశమంతా అణచివేసి
దుష్ట సాంప్రదాయపు కుహనా
పునాదులు కదల్చి వేసి
అభ్యుదయ పాలన అంతటా
నెలకొల్పిన నాయకబ్రహ్మ లెనిన్

మత మౌఢ్యమునకు సంకెళ్ళు వేసి
మానవత్వ మహావృక్షమును
మహోజ్జ్వలయుగ పాదుకొల్పి
ప్రజలకు శాంతి గొడుగును
పట్టిన నాయకుడు లెనిన్
బంగారు గోపురాల
మసీదు చర్చి భవనాలను
ప్రదర్శన శాలలుగా నెలకొల్పి
సర్వప్రజా సామరస్యమును
దేశమంతా ఘుమ ఘుమ లాడించిన
నాయకమణి లెనిన్.
భయంకర క్షుద్బాధను
బంతిలా ఎగరకొట్టి
దేశ సంపదను అందరికి
అందించగలిగిన నాయక బ్రహ్మ లెనిన్
మానవత్వాన్ని గుండెనిండా నింపుకుని
దేశమంతా గుబాళింప చేసిన
అత్యున్నతా మానవతా శీలి లెనిన్
ధన మదాంధత రెక్కలు విరిచి
అంతస్తుల అడ్డుగోడల ఇటుకలను
సడలించిన ధైర్యశాలి లెనిన్
ఆధునిక సర్వస్వతంత్ర దేశానికి
వెలుగుబాటలు వేసి
ఆ బాటలో సర్వ ప్రజలను
నడిపించే సూత్రధారి లెనిన్

మహిళా సంక్షేమమే
దేశ సంక్షేమమని తలచి
మహిళలకు నిర్భయ స్థితిని
శాశ్వతముగా పాదుకొల్పిన
దేశ సంక్షేమ సంస్థాపకుడు లెనిన్.
సింతు దేహాన్ని
దేశ సేవకై అర్పించి
నిరాడంబరత్వమునకు నిదర్శనముగా
ఆదర్శాలకు ఆలంబనముగా
జీవితాన్ని నడిపించిన
ఆదర్శ నాయకమణి లెనిన్
ప్రజల సౌఖ్యమునకై పాటుపడి
ప్రతి ఇంటా సుఖశాంతులు
రంగరించిన మహానేత లెనిన్
లెనిన్ నాయకామణీ!
నీవు మరణించినా
నీ వజ్రశరీరం ప్రజల
మధ్యలో నడయాడుతోంది
నీవు మరణించినా
నీ ఆశయాల జ్యోతి
నీ వారి హృదయంలో
చైతన్యము గుప్పుతోంది
నీవు మరణించినా
నీవు పెంచిన దేశభక్తి
నీ వారి వెన్నంటి నడుస్తోంది
ఓ! లెనిన్ మహాశయా

శ్రామిక మహా నాయకుడివి
శ్రామిక ఆదర్శ సిద్ధాంత కర్తవు
శ్రామిక ఆచరణ మహాసముద్రానివి
నీ చుట్టూ ఉన్న ప్రజల బతుకులు
పంతంపట్టై కంకణం కట్టుకొని
విజయం సాధించిన
వీరనాయకాగ్రణివి నువ్వు
నీ జీవితం ఒక సూర్యగోళం
నీ ఆశయం ఒక చంద్రగోళం

# ఓ రష్యా మహిళా

స్వేచ్ఛా భావాలతో
ఊపిరి నింపుకుంటూ
మూర్తీభవించిన
స్వతంత్ర శక్తితో
అంతరాత్మను పెంచుకుంటూ
ఎడతెగని పరిశ్రమలో
దేహ బలాన్ని పుంజుకుంటూ
ఆధునిక మహిళా లోకానికి
ఆదర్శంగా నిలబడిన
ఓః రష్యా మహిళా
అభ్యుదయ పథంలో
అరుణ కిరణమై

చకచకగా అడుగులు వేస్తూ
దేశ ఔన్నత్యాన్ని
వికసింపచేసే మణిపూసవు నువ్వు
మిసమిసలాడె బంగారు రంగులో
నల్లని కురుల సొగసులో
శక్తి యుక్తుల బిగువుతో
అచంచల కార్యదీక్షతో
కృషిచేసే సుందరాంగివి నువ్వు
పిల్లల పాలిట కామధేనువులా
దేశం పాలిట దేవతలా
నిలిచిన త్యాగమూర్తివి నువ్వు
కారు డ్రైవింగులో
ట్రామ్ రన్నింగులో
అంతరిక్షయానంలో
అందెవేసిన హస్తం నీది
పురుషులకు తోడుగానిలవాలని
సిరులు కట్టిన చురుకుతనంలో
పురుషులనే అధిగమిస్తున్నావు నువ్వు
నీవు నేర్వని విద్యలేదు
నీవు అడుగుపెట్టని రంగమేలేదు
నీవు వంటరిగా అర్ధరాత్రి
నడిబజారులో నడుచుకు పోతుంటే
కళ్ళారాచూసి చకితనయ్యాను
నీ అభ్యున్నతికి మురిసిపోయాను
స్త్రీ మూర్తి దేశానికి కన్నతల్లి
మాతృమూర్తి దేశానికి
శ్రీరామ రక్ష

అందుకే నీ దేశం నిన్ను
కన్నతల్లిలా కాపాడుతోంది
రెండవ ప్రపంచ సంగ్రామంలో
వాడి కరవాలమును చేతబట్టి
వీరనారివై కదనరంగంలో
మహంకాళిలా విజృంభించావని
శత్రుకంఠాలను బంతుల్లా
ఎగరగొట్టావని తెలిసి
తిరిగి స్వాతంత్ర్య నెలకొల్పావనివిని
ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయ్యారసు
మా రాణీ రుద్రమదేవికి
మా ఝాన్సీ లక్ష్మీబాయికి
తోబుట్టువులు మీరని తెలుసుకున్నాను
నిద్రలేచింది మొదలు
ఐద్దక మెరుగక
కష్టించి పనిచేసే
కృషీవలివి నువ్వు
చదువులు నేర్చావు
సంపాదన చేపట్టావు
ఆప్యాయత శాలువాలా కప్పుకొని
నిర్భయంగా సాగిపోతున్నావు
ఓ రష్యా మహిళా!
అసాధారణ శక్తి సామర్థ్యాల!
నీ ధ్యేయం మహోన్నతం
నీ భావం మహోజ్జ్వలం

# నరజాతికి నవ్యపథం

అప్పుడప్పుడు కనిపిస్తున్నాడు సూర్యుడు
ఎర్రజండా నిగనిగలలో
తనవేడిమి కొలుచుకోవాలని.

ఎల్లప్పుడు వణికిస్తోంది చలి
రష్యా ప్రగతి పథంలో
తనశక్తి పరీక్షించుకోవాలని.

తడవ తడవకు కురుస్తోంది మంచు
రష్యాదేశపు ఔన్నత్యానికి హారతిగా
మల్లెల జల్లై నిలిచి పోవాలని

మత మౌఢ్యానికి తావులేదు అక్కడ
ఉంది స్థానం మానవత్వానికి

వినాయకులులేరు అక్కడ
ఉన్నాడు ఒక్కడే నాయకుడు
ఆశయాలకు ఆచరణకు రూపుదిద్దిన
పాలనా దక్షుడు లెనిన్

పూజలు లేవు అక్కడ
మరి ఉన్నాయి పూగుత్తులు
దేశానికై ప్రాణాలు అర్పించిన
వీరనాయకుల సమాధులకు

ఉద్యోగానికి లంచాలు లేవు అక్కడ
నిరుద్యోగానికి తావులేదు అక్కడ
ఎడ్యుకేషన్‌కి మరిలేవు డొనేషన్లు
మరి ఉంది ఎడ్యుకేషన్ అందరికి

చింపిరి బట్టలవారు
చికాకైన ముఖాలవారులేరు
ఉన్నారు సిరులు వెదజల్లే
చిరునవ్వుల ముఖాలవారు

చేయిచాచేవారు లేరు అక్కడ
ఉన్నారు స్నేహానికి చేతులుకలిపేవారు
దేశానికై ప్రాణాలు అర్పించేవారు

ఇల్లులేనివాడు లేరు
ఉన్నాయి ఇళ్ళు కుటుంబానికి చాలినంత
కోట్లు కుడిచేవాడు
పొట్ట నడిపేవాడు
నివసిస్తున్నాడు ఏక అంతస్తులో

సిపాయికి ఉంది గౌరవం
సఫాయికి ఉంది ఎక్కువజీతం

ఆడ మగ ఉన్నారు అందంగా ఆరోగ్యంగా
పిల్లాపాపా ఉన్నారు పూబంతుల్లా

అర్ధరాత్రి నడిబజారులో
నిర్భయంగా నడుచుకు పోతోందిఆడది

ఏ దేశానికైనా
ఇంతకంటే ఏ మున్నది
గర్వకారణం
నరజాతికి ఈ దేశం
నవ్యపథం
పరజాతికి ఈ దేశం
భద్రకాళి రూపం

—0—

# మానవతా మందిరం

శీతల పవనాల సుందరతీరంలో
హిమధారల ఆరామ వాటికలో
అగ్ని పుష్పంలా వికసించింది
అభ్యుదయ రష్యాదేశం

ముచ్చటైన తాష్కెంటు మణికిరీటమై
అందాల లెనిన్‌గ్రాడ్ పాద పీఠమై
మాస్కో మహానగరం తారహారమై
కేవ్‌సౌచీలు భుజకీర్తులై
నిలిచాయి రష్యా రాజ్యలక్ష్మికి

సువిశాల విమానాశ్రయాలలో
మానస సరోవరంలోని రాజహంసల్లా
నడయాడుతున్నాయి
విమాన పంక్తులు

నగరానికి నిలువుపాపిటలై
పొడవైన రాచ బాటలు
నీటుగా సాగిపోతున్నాయి


అందాల శిల్ప సుందరుల్లా
ఆధునిక సౌకర్యాలతో
దేశ సౌభాగ్యాన్ని తెలియజేస్తూ

టూరిస్టులకు ప్రత్యేకమై
నిలిచి ఉన్నాయి హోటళ్ళ భవనాలు
మంచుపూల వెండి చుక్కలలో
మిలమిల లాడుతున్నాయి
ఎర్రని గులాబీల
ఆమరా వాటికలు

మంచుతెరల మేలిముసుగులో
నిటారుగా నిలిచిఉన్నాయి
భూరుహ వాటికలు

మంచువానలు ముంచుకొస్తుంటే
చలిగాలులు గిలిగింతలు పెడుతుంటే
వెచ్చని ఉన్నిదుస్తుల కౌగిలిలో

నాగరికతా తీగకు పూచిన
సంస్కారపు పూవులై
వికసించిన ముఖాలతో
దబ్బపండువంటి శరీర సౌభాగ్యంతో
చురుకుగా అడుగులువేస్తూ
సాగి పోతున్నారు ఆడామగ

సాహితీ సేవకు నిదర్శన శాలలుగా
గోర్కి, పుష్కిన్ వంటి
మహాకవుల ప్రదర్శనశాలలు
విజ్ఞానాన్ని వెదజల్లు తున్నాయి
రెడ్ స్క్వేర్, లెనిన్ స్క్వేరులు

నగరానికి నడిబొడ్డులై
విశాల సౌభాగ్యంతో నిలిచి ఉన్నాయి
వింటర్ హౌసులు
సమ్మర్ హౌసులు
గతవైభవానికి ప్రతీకలై సేవిస్తున్నాయి

నీవా, రీవా, మాస్కో జీవనదులు
శీతల తుషార బిందువులు
ఆ దేశానికి శ్రీరామ రక్షలు

అంతఃపుర వైభవాన్ని
మెట్రో స్టేషనులు గుర్తుచేస్తుంటే
భూమిలోపల రామబాణంలా
దూసుకుపోతున్నాయి మెట్రోరైళ్ళు

భూమిపై రేసుగుర్రాలై
పరుగులు పెడుతున్నాయి
ట్రాములు బస్సులు మోటారులు

ఉన్నతమైన విశ్వవిద్యాలయాలు
విశాలమైన లైబ్రేరీలు
వెదజల్లుతున్నాయి
విద్యా వివేక సుగంధాలను.

మహోన్నత మహాతపశ్శాలిలా
నిశ్చలంగా నిర్మలంగా
నిలిచిఉంది స్వర్గీయ భారతనేత
లాల్ బహదూర్ శాస్త్రి సమాధి.
నిత్యం తాష్కెంటు వాసుల
నాలుకలపై నడ యాడుతూ
భారత రష్యాదేశాల
సమైక్యతా చిహ్నమై
వెలశాయి ఆ మహానేతపేర
వీధి, విద్యాలయం.

దేశంలో తిరుగుబాటు శంఖం పూరించి
సాంఘిక దురాచారాలను రూపుమాపి
మత మౌఢ్యాన్ని మంటకలిపి
దేశాన్ని ప్రగతిపథంవైపు
నడిపించిన మహానాయకుడు

లెనిన్ పేర వెలసిన మ్యూజియం
ఆతని అకుంఠిత కార్య
నిర్వహణకు ప్రతీకమై నిలిచింది
నేటి రష్యావాసులకు
ఆదర్శజ్యోతి అది.

ఎకనామిక్ ఎగ్జిబిషన్
వారి ప్రగతిని పేర్చిన
బొమ్మరిల్లు గా
మాస్కోకు హరివిల్లుగా వెలుగుతోంది.

మానవత్వంతో కలిసిన
మతానికి ప్రతీకలై
నిశ్చలంగా నిర్మలంగా
నిలిచి ఉన్నాయి చర్చిలు, మశీదులు

అందంగా తెల్లని పలువరుస
మిలమిల మెరిసిపోతుంటే
చిరునవ్వుల సొగసులు
ముఖ మండలంలో తొంగిచూస్తుంటే
రష్యా సువాసినులు
మా నుదుట వెలిగే కుంకుమబొట్టును
మా జరీపట్టు చీరల లావణ్యాన్ని చూసి
ఏ దేశమని అర్థంకాని
భాషలో అడిగినా
అర్థంచేసుకున్న మేము

ఇండియా అని సమాధానమీయగానే
ఇండియా ఇండియా అంటూ
వెలిగే సంతోషంతో
మా చుట్టూచేరిన వారిమాటలు
అర్థం కాకపోయినా
ఆ సహృదయ నారీమణుల
వికసించిన మానసాల
పరిమళాలను ఆఘ్రాణించాము
వారికళ్ళలో గుప్పుమన్న మెరుపులు
మా గుండెలను ముంచెత్తివేయగా
ఆనందపు పిల్లగాలులకు
చివురాకుల్లా మా శరీరాలు
కదిలి ఆడగా
ఇండియాకు మేమే
ప్రతినిధులమని గర్వంతో
నిటారుగా నిలబడ్డాము.

పిల్లలను కాపాడె తల్లితండ్రులను
పెద్దలను ఆదరించే సంతానాన్ని
చూసి ఎంతగానో సంతసించాము.

ఆ దేశమే ఒక దేవాలయం
ప్రజలే పూజారులక్కడ
లేవు రక్తపాతాలు
లేవు సంకుచిత ద్వేషాలు
క్రమశిక్షణకు పతాకస్థానమది.

నిలిచి ఉంది లెనిన్ భౌతికకాయం
దేశానికి కాంతిపుంజంలా
నాయకులకు వెలుగుబాటగా
ప్రజలకు ఆత్మస్థైర్యంగా

ఆ దేశం పయనిస్తోంది
అరుణ పథాలవైపు
వెలుగుతోంది మహోన్నత
మానవతా మందిరమై,

శ్రమ జీవనానికి
ఆ దేశం ఆదర్శం
అభ్యుదయ వీధికి పరచిన
వెలుగు తివాచీ ఆ దేశం



# Salutation

That Democracy
Born as Fiery Flower
Shining Like Fiery SUN
Protector Like Fiery GOD
of the upressed Fredom Lovers.

That Peoples Regime
Rose Like Furios Ocean
Glowing Like Flames
Overturned the Imperialist Designs
Fired Revolutionary Ideals

That democratic Nation
Raising Like a destroyer of Evils
Blowing like Fiery wind
Blew the Caunch of Revolution .

That peoples Rule
Which pierced like Tremondous Weapon
Spread like the dark Rainy Cloud

Blew thunder Bolts
In the harts cf destructive Elements

To such Protector of freedom
To such Glowing SUN
To such stable idealistic Nation
To such soviet Socialist Republic
offer my poetic salutations.



# Prosper Oh Russia, Prosper

Porper ! Prosper !
Soviet Russia
Prosper ! Prosper !
Socialist Russia.

Born on the Ideals
Of Marx,' Lenin and Stalin
Progressing on the Chariot
Having wheels of Freedom and Equality

You kindled lights of Prosperity
Among the Bonded slavish lives
Generated emotion of revolt
Among the condemned workers
Built a heaven on earth.

You struck a blow to evil
and Capitalist designs
Crowned the common man
the Ruler of His Destiny !

Oh Builder of Nuclear Weapons to Sky High
We salute for they Efforts
To enrich knowledge about Planets
Through Scientific Exploration.

We cherish your efforts for
World Peace and Progress
Oh ! Gigantic Super Power.

You wonderstuck the world with awe
In building a heaven on Earth
In tiny span of Independance

Oh ! Russia your Leadership
under Comrade Gorbachev
Surpassed many hurdles
Aimed at Peoples Welfare
Strengthened the Bonds of Friendship
With our Mother Land–India
of peace and prosperity.

Oh! Russia, your heart is wider,
Your ideals are universal,
Your Actions are inspiriing,
In attaining Brother—hood and
International Co–operative world peace